ఈ శాంతిపాఠము విద్యాబోధన విద్యాభ్యాస విషయకముగా యానాటి గురు శిష్యులకు గల సాముహికోత్సాహమును, వారికిగల పరస్పర సంబంధమును తెలియజేయుచున్నది. ఈనాటి గురు శిష్యుల సంబంధము నకును, అనాటి వారి సంబంధమునకును యెంతటి భేదమున్నది!

ఈనాడు గురువు యేదో యొకవిధముగా తన పనిని ముగించు కొనుటకు చూచుకొనునప్పుడు శిష్యుడు తన హాజరు పడినదా లేదా యనే యాతురతతో తరగతిలోనికి ప్రవేశించును. అట్టి పరిస్థితిలో గురువునకు శిష్యు డొక యనివార్యమగు విసుగు కలిగించు వ్యక్తి. శిష్యునకు గురువు కళాశాలా జీవితమనే పూలసెజ్జలో కంటకమువంటివాడు.

బ్రహ్మవిద్యలోమాత్రము గురుశిష్యుల పరస్పర సహకారము, శ్రద్ధ యనునది లేకున్న యభివృద్ధి కలుగనేరదు. కావుననే "మావిద్విషావహై" యను ప్రత్యేక ప్రార్థన యీ శాంతిపాఠములో చేర్చబడినది. వ్యర్థమై, యడుగడునకు వినాశహేతువులగు నపార్థములకు యనర్థములకు దారి తీయు శ్రుతిమంత్రముల పాఠమందు చవట చప్పిడి వాదనలకు అవకాశమున్నది కావున యీ ప్రార్థన యట్టివానిని వారించి గురుశిష్యులమధ్య పరస్పర సహకారము కలిగియుండుటకై శాంతిపాఠములో చేర్చబడినది.

విద్యాధ్యయన ప్రారంభములోను అంతమందుకూడ యీ శాంతి పాఠము గురుశిష్యులచే ప్రతిదినము పఠింపబడును. ఈనాటికిని వేదాధ్య యనము చేయు చోట్ల యీ పాఠము తప్పనిసరిగా చదువబడుచునే యున్నది.

హరిః ఓం తత్ సత్ ॥

---

PRINTED AT THE B. N. K. PRESS (PRIVATE) LTD., MADRAS-26.